# అమరవాణీ ప్రసారములు

సంకలనకర్త, పీఠికాకర్త

పైడిపాటి సుబ్బరామశాస్త్రి
విద్వాన్, బి. ఎ, (డబుల్), పి ఒ యల్

ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమి
కళాభవన్ - సైఫాబాదు,
హైదరాబాదు-4

# వి ష య సూ చి క

## సిం హా వ లో క న ము

## అమరవాణి ప్రసారములు

# సింహావలోకనము

## సంస్కృత భాషయననేమి ?

పతంజలి కృతమహాభాష్యమునందు 'సంస్కృతం నామ దైవీవాక్' అని చెప్పబడి యున్నది దేవతల భాషలో జఱుపబడిన క్రియా కలాపములు వారికి సూటిగాచేరును యజ్ఞమునకు దేవతలు సంతసించి వర్షము నుకురియు చున్నారు వాని వలన మానవులకు పంటలు పండుచున్నవి ఆంగ్ల భాషకు నర్థము తెలియనివారు ఆంగ్లములో అర్జీని వ్రాయించి పంపు కొన్నచో, నాంగ్ల భాషాభిజ్ఞులగు నధికారులు అర్జీదారున కెట్లుప్రకృతిని కావించుచున్నారో, అట్లే సంస్కృతభాష కర్థము తెలియనివా రుచ్చరించిన శ్లోకములకును దేవత లనుగ్రహింతురు అందుచేతనే యీ దేశమున జననము మొదలు మరణము వఱకు జఱుగు క్రియాకలాప మంతయు దేవభాషలోనే జఱుగును సంస్కృత భాషలోని శక్తిని గ్రహించిన శ్రీ కె యమ్ మున్షీ గారిట్లను చున్నారు **"The European reformation infiated by Martin Luther led me to Copclude that prayers in Gujarathi or English would be equally effacious as in Sanskrit But soon I discovered that they could not evoke the faith which the Sanskrit Manthras did ("How faith Came to me")**

ఉన్నభాష వాడుకవలన అరిగిపోయినప్పుడు, ప్రకృతి ప్రత్యయ విభాగముచేసి యొకవిధమైన కట్టుదిట్టము చేయుటచే, సంస్కృతమైనదని, వైయాకరణుల అభిప్రాయమనియు, సంస్కారమనగా-గుణనిధానము, దోషాపనయనము, అని ఆదిశంకరులు సెలవిచ్చిరనియు, ఇంటికి బూజుదులుపుట సున్నము కొట్టుట వంటిదే యీసంస్కారమనియు శ్రీ కామకోటి పీఠాధిపతులు చంద్రశేఖరేంద్ర సరస్వతీ స్వామివారు సెలవిచ్చి యున్నారు 'సంస్కృతానాం భాషా' అని షష్ఠీతత్పురుషమును కొందఱు చెప్పగా, 'సంస్కృతా చ సా భాషా' అని కర్మధారయమును కొందఱు చెప్పుదురు

## సంస్కృతము నార్య భాషయందురా ?

"క్రీస్తుశకము ఏడవశతాబ్దమున ఇండియాకు వచ్చిన చీనాయాత్రికుడు 'ఇ-సింగ్'-తన యాత్రా విశేషములను గ్రంథస్థము చేయుచు, ఉత్తరమునుండి వచ్చిన సెంట్రల్ ఏషియావారు ఇండియాదేశమును "హిందూ" అనెదరు కాని అది సరియైన పేరు కాదు ఆర్యదేశమనుటయే బహుధా ఉచితము అని వ్రాసెను 'హిందూ' అను పదమును మతమునకు ముడిపెట్టుట ఇటీవల జఱిగిన పనియే ఆ కాలమున మతమును సూచించు మాట ఆర్యధర్మము" (శ్రీ నెహ్రూగారి డిస్కవరీ ఆఫ్ ఇండియా) ఈదేశము ఆర్యదేశము కనుక ఈ దేశపుభాష ఆర్యభాష యని చెప్పవచ్చును ఆర్యభాష యను వ్యవహారము సంస్కృతభాషకు కలదనుటకు "మేచ్ఛవాచశ్చార్యవాచస్సర్వే" (10-45) అను మనుస్మృతి వచనము చాలును ఈభాషను గూర్చి దేశీయ పండితులును, పాశ్చాత్య పండితులును వెలువరించిన యభిప్రాయములను గమనించుట యావశ్యకము

## శ్రీశ్రీశ్రీ ద్వారకా పీఠాధిపతులు

**So far as India is Concerned Sanskrit is India and India is Sanskrit To say that a language with such a hoary tradition and Culture is out of date is a height of foolishness It is a true pass-port to success in the world and the world hereafter. It runs in every Indian's blood in a strong or diluted manner**

## మహాత్మగాంధీ

**I hold that every Hindu boy and girl must acquire a knowledge of Sanskrit and every Hindu should have enough knowledge of Sanskrit to be able to express himself in that language whenever an occasion arises It is a matter of history that contact in the old days between South and North used to be maintained by means of Sanskrit Even to-day the Shastris in the South hold discourses with the shastris in the North through Sanskrit.**

If had not acquired the little Sanskrit that I learnt, then I should have found it difficult to take any interest in our sacred books

స్వామి వివేకానంద

.. The great difficulty in the way is the Sanskrit language, the glorious language of ours and this diffiiculty cannot be removed until if it is possible, the whole of our Nation are good Sanskrit Scholars at the same time Sanskrit Education must go along with it, because the very sound of Sanskrit words give prestige, a power and Strength to the race

శ్రీ జవహర్ లాల్ నెహ్రూ

Sanskrit is the greatest treasure which India posseses. It is a magnificiant inheritance and so long as this endures in the life of our people, the basic genious of India will continue.

శ్రీ వి. వి. గిరి.

Sanskrit is the symbol of India's heritage, culture and civilization

శ్రీ కె. యమ్. మున్షీ

In the recent past, though a subject race, we gained our lost prestige through Scholars whole vision had been largely enriched by Sanskrit studies—Pali, cultural link with South East Asia, China and Japan If Sanskrit were neglected we will imperil the basic unity, If there has been any golden thread of unity, it has been supplied by Sanskrit

శ్రీ యమ్. సి. చాగ్లా

Sanskrit should be an integral part of our language-formula with regard to Education

డాక్టర్ సి. పి రామస్వామి అయ్యర్

Sanskrit culture is not only not dead, but vigorously alive

డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి :

Sanskrit is the source of all our languages

శ్రీ పి. వి. రాజమన్నార్

We must give our children an opportunity to learn Sanskrit by making the study of the language compulsory in our schools The study of the Sanskrit would In indirect and sub-conscious way induce in us a sense of the fundamental unity of the whole of India A line from Valmiki, a simile from Kalidasa, or a noble utterance from the Upanishads would touch our heart strings and stir in us a thousand memories - memories sub-conscious, ancestral, primeval, *going back to the origin of man in India*-memories of our great and glorious past which binds us together, though in this superficial present we are torn by differences and dissensions The greatest value of Sanskrit probably lies in its usefulness to build up our National life on healthy lines. That is why I appeal to the persons who are in charge of thc education of our province (Madras) not to have any hatred for Sanskrit or to accord to it step-motherly treatment, but positively to encourage the study of the language (7–3–48)

డాక్టరు కట్టమంచి రామలింగారెడ్డి

Why a spoken language alone should be State language of India ? English and Persian had been the State languages during British and Persian periods respectively though they were not the spoken languages in any part of India I support Dr K N Katju, the Governor of Orissa, in pleading for the adoption of Sanskrit as a State language of India The roots of Indian culture are deeply laid in Sanskrit A large part of Asiatic eulture is based on Sanskrit in its Buddhistic form Sanskrit is the basis of many Indian

languages. Its lıterature ıs rıch and vast. Not only phılosophy but even law and Scıentıfic terms can be accurately expressed ın Sanskrıt. These vıews may sound ordhodox to some, heterodox to some others (1948)

శ్రీ గజేంద్ర గడ్కర్ .

A Natıon whıch does not honour ıts past ınherıtance, wıll not leave to the posterıty any ınherıtance of whıch posterıty wıll be proud If 50% marks wil' be alloted to a modern language 50%are to be alloted to Sanskrıt

శ్రీ ఆర్. ఆర్. దివాకర్ .

No study of Indıan culture can be thorough and complete wıthout a study of the Sanskrıt language and lıterature, ın the orıgınal That study ıtself ıs the dıscıplıne to the mınd.. So far as Sanskrıt teaching ın the present Schools and Colleges ıs concerned, ıt would be advısıble and hıghly wise, except ın the case of those who wısh to take a hıgher Sanskrıt studıes as such, to teach Sanskrıt not as a seperate language altogether, but to teach ıt ın coordınatıon and correlatıon wıth the respective Indıan languages.

శ్రీ పట్టంతాను పిళ్లై

If the three language formula hampers the growth of Sanskrıt, ıt wıll be a tragedy and the formula should be relaxed so as to ınclude Sanskrıt also ın ıts fold It would be foolısh and even suıcıdal to neglect Sanskrıt language and lıterature

శ్రీ కె ఎమ్. పణిక్కర్

The ıntellectual unıty of the Hındus was provıded by a common classıcal language, Sanskrıt Another factor

which helped in the growth of self confidence was the revival of Sanskrit and the growth of Indological scholarship

శ్రీ ఖండుభాయ్ దేశాయ్

It is regarded as divine language . If we want to enrich the Indian languages and develop them, Sanskrit should be made a compulsory subject as any other language It should be modernised and propagated and developed systematically so that it would lead for integration of the whole Country

ప్రొఫెసర్ యస్ యస్ దాస్ గుప్త

It was the only language in which the whole of India expressed all her best thoughts and it has united the culture of India

శ్రీ ఎ. వి కె అయ్యర్

Far from being a dead Sanskrit is very much alive and kicking.

శ్రీ పి. వి నరసింహారావు

It should be simplified Sanskrit should be taught as part of the Telugu language to avoid opposition from the people, particularly from students It must be introduced while changing the Telugu text-books Though everyone expressed a desire to develop Sanskrit language no steps were taken to develop it, efforts be made to include Sanskrit in the curriculum The union government wanted the states to promote Sanskrit study

శ్రీ షఫీ మహమ్మద్

The study of this great language, Sanskrit, will inculcate in the people, a spirit of tolerence, understanding and

goodwill It is rediculous to call Sanskrit, a dead language. Due to years of foreign domination, Indians had not only become slaves politically and economically but also culturally They had blindly given up their ancient culture and traditions. If their ancients had led a pure and peaceful life, it was because they were imbued with Sanskrit culture (25-1-48, Hindu)

## శ్రీ సర్ విలియమ్ జోన్స్ ·

సంస్కృతభాషా నిర్మాణ మద్భుతము గ్రీకుభాషకంటె ఎక్కువలోప రహితము, పరిపూర్ణము లాటినుభాషకంటె బాహుళ్యమైనది ఆరెండింటి కంటెను స్వచ్ఛమైనది సంస్కృతభాషలో నున్నంత దీర్ఘసమాసము లికేభాష యందును లేవు 152 అచ్చులతో పొడుగైన సమాసములు కలవు హిందూ సారస్వతములో నేదియేని యొక అల్పభాగముతో పరిచయము గల్గించు కొనుటకు ఒక్కని జీవితము చాలదు ఇప్పటి వఱకు అముద్రితములుగ మిగిలిన గ్రంథములు పదివేలు కలవు గ్రీకు, ఇటివలి ప్రాచీన వాఙ్మయములు కలిపి చూచినను ఈ సంఖ్యకు తీసికట్టే

## శ్రీ మాక్సుముల్లర్

భాషలకు భాష జ్యోతిషమునకు గణితమెట్లో భాషాశాస్త్రమునకు సంస్కృతమట్లు Sanskrit literature, if studied only in a right spirit, is full of human interest, full or less in which even greek could never teach us (Max Muller's India)

## శ్రీ మాక్డొనెల్ :

ఐరోపియనుల బుద్ధివికాసమునకు సంస్కృత సారస్వతము చేసిన సేవ సమధికమనుటకు సందేహము లేదు The intelluectual debt of Europe to Sanskrit literature has been undeniably great It may perhaps become greater still in the years to come (History of Sanskrit literature)

సర్ హన్టర్ :

ఆధునికుల భాషాశాస్త్రము యూరోపియనులు సంస్కృతము పఠింప మొదలిడిన పిదప నారంభ మయ్యెనని తెలియనగును The age of this venerable hymn (Rigveda) is unknown. The grammar of Panini stands Supreme among the grammarians of the world.

కౌంట్ జారన్ స్టెర్నా

The literature of India makes us acquainted with a great Nation of past ages, which grasped every branch of knowledge and which will always occupy a distinguished place in the history of the civilization of man kind (Theogony of the Hindus)

శ్రీ ష్లెజల్ ·

ఈ భాషకు సంస్కృతమను నామాంతర మెంతయు యుక్తి యుక్త మైనది సంస్కృతమనగా లోపరహితము గావించి మెఱుగుపెట్టి పరిపక్వ స్థితికి తెచ్చినదని యర్థము

శ్రీ ఇబియా

రోమనుల భాషవలె ధాటిగలది హీబ్రూ భాషవలె భగవదంశకలది వ్యాకరణమునం దగ్రస్థానము వహించుచున్నది

శ్రీ హీరాన్

India is the source from which not only the rest of Asia but the whole western world derived its knowledge and religion

శ్రీ వేలర్ .

The parent of all those dialects the Europe has fondly called classical the source alike of greek flexibility and Roman strength a language of unrivalled richness and variety.

శ్రీ ఎలిఫిన్‌స్టన్

In the composition of tales and fables they (Hindus) appear to have been the instructors of the rest of the mankind

శ్రీ ఫాషీ

Homer took his ideas from Ramayana.

శ్రీ వార్ట్

No reasonable person will deny to the Hindus of former times the pride of very extensive learning the variety of subjects upon which they wrote prose that almost every science was cultivated among them.

శ్రీ హరవిలాస శారదా :

No country except India and no language except Sanskrit can boast of a position so ancient and venerable.

శ్రీ నెప్రూహా .

సంస్కృత భాష ఆశ్చర్యకరమగునంత సౌభాగ్యవంతమైనది స్వయం ప్రకాశవంతమైనది వివిధశాఖలలో ఏపుగా పెరిగినట్టిది ఐనను సమగ్రముగ వ్యాకరణనియమ బద్ధముగ నుండును విదేశీయులకు వారెంత భాషా వేత్తలయినప్పటికిని దీని నవగాహనము చేసికొనుట మిక్కిలి కష్టము పండితుడైన కవి మాత్రమే యీ భాషను వ్యాఖ్యానింప గలడు. ఇక వట్టి పండితుల వల్ల మనకు లభించు వ్యాఖ్యానము "అస్పష్టమైన భావ చ్ఛాయలును, పైకి స్పష్టముగ కన్పించునర్థములు మాత్రమే" యని యమ్ బార్త్ వ్రాసెను (శాశత దర్శనము నుండి )

## వేదములు సృష్టి .

ప్రపంచమున వేదమున కంటె ప్రాచీనమైన వాక్కు కలదని యెవ్వరును ఋజువుచేయలేరు అది యపౌరుషేయము "Veda is eternal and impersonal (i e ) the texts are not made by any person"

(C Kunhan Raja) వేదాభ్యాసమునకు వేదపఠనమునకు కొన్ని నియమములున్నవి

హస్తహీనస్తు యోధీతే స్వరవర్ణ వివర్జితః
ఋగ్యజుస్సామభిర్దగ్ధో వియోనిమధిగచ్ఛతి
(నారదస్మృతి)
గీతీ శీఘ్రీ శిరఃకంపీ తథా లిఖితపాఠకః
అనర్థజ్ఞోల్పకంఠశ్చ షడేతే పాఠకాధమాః
(పాణినీయశిక్ష)

ఈ నియమముల పాటించుచు వాని కంకితమై చిరకాలము నుండియు నిర్ణీతమైన స్వర సంపత్తితో మనకీనాటికి కొందఱు కన్పించుచున్నారు ఉత్తర భారతమున జన్మించి అవతారపురుషుడుగా భావింపబడిన క్షత్రియ ప్రభువు శ్రీరామచంద్రుని నుండి దక్షిణ భారతపు కొసను లంకాధిపుడైన బ్రాహ్మణ ప్రభువు రావణుని వఱకును అభ్యసించిన విద్య వేదము ఈ వేదమును పాశ్చాత్య పండితులెంతగనో ప్రశంసించిరి "They are without doubt, the oldest works composed in Sanskrit Even the most ancient Sanskrit writings allow the Vedas as already existing" అని ప్రొఫెసర్ హీరన్ గారనిరి

"There is no monument of Greece or Rome more precious than the Rigveda" అని మాన్సు లీయన్ డెల్బాస్ పండితుడనెను "The Yasurveda was the most precious gift for which the West had been ever indebted to the East" అని వాల్టేరు గారనిరి ". In the history of the world, the Vedas fill a gap which no literary work in any other language could fill" అని విల్సన్ గారనిరి "Nor can Science ever solve the problem of the origin of man if it rejects the evidence of the oldest records in the world" అని బ్లావెట్స్కీగారనిరి "The Vedic literature opens to us a chapter in what has been called the education of the human race, to which we can find no parallel any where else I maintain that to

everybody who cares for himself, for his ancestors, *for his history*, for his intellectual development, a study of Vedic literature is indispensable  I believe it had a hidden purpose, and man intended to teach us some kind of lesson that is worth learning, and that certainly we could learn nowhere else  It carries us back to times of which we have no records anywhere and gives the very words of a generation of men whom otherwise we could form but the vague estimate by means of conjectures and inferences  As long as man continues to take an interest in the history of his race, and as long as we collect in libraries and museums the relics of former ages, *the first place* in the long row of books which contain the records of the Aryan branch of the man-kind, will belong *to the Rigveda*  The Vedic religion was the only one the development of which took place without any extraneous influences and could be watched through a longer series of centuries than any other relgion  In India alone, and more *particularly in Vedic India,* we see a plant entirely nutured by native air  For this reason, because the religion of the Veda was so completely guarded *from all strange infections,* it is full of lessons which the student of religion could learn nowhere else  The europeans are still on the mere *surface* of Vedic literature and *must not reject it as useless* if they do not find in it corrobaration of their pre-concieved theories of anthropology and sociogy. అని మాక్సు ముల్లరు మహాశయు డుద్ఘాటించెను

"వేదముల భాషకు వైదిక భాషయని పేరు  సంస్కృతము వైదిక భాషకంటె భిన్నమైనదికాదు  పై వాక్యములను బట్టి సంస్కృత భాషా ప్రాచీనత వెల్లడియగుచున్నది  వేదములకు కాలమును నిర్ణయింపవలెనని పాశ్చాత్యపండితులు ప్రయత్నము చేసిరి. వారి యభిప్రాయములో నార్యులు ప్రకృతిని గూర్చి చేసిన గానమే ఋగ్వేదమనియు, వారికి వ్యవసాయము చేయుట తెలియుననియు, మొదట పుట్టిన వేదము ఋగ్వేదమనియు నిట్టి యూహాలనెన్నెన్నో చేసిరి  దేశీయ పండితులట్టి యూహాలతో వేకీ

భవింపరు "న్యూటెస్టమెంటు" అను క్రైస్తవగ్రంధము రెండువేలేండ్ల నాటిది పైగంబరు వారికి విన్పించిన ఈశ్వర వాక్కు అనిపించుకొను 'కొరాను' సుమారు 1200 ఏండ్లనాటిది ఇట్లు ఈ గ్రంధములకు కాల నిర్ణయము జఱిగెను కాని వేదకాలమును నిర్ణయించుటకు సాధ్యము కాలేదు వేదములు రచితములని చెప్పగోరు పాశ్చాత్యపండితులు 3500 ఏండ్లనాటి వందురు కొందఱు 5000 ఏండ్ల క్రింద వేదములు పుట్టిన వందురు తిలక్ పండితుడు వేదముల వయస్సు 8000 ఏండ్లనెను జాకోబీ పండితుడాయనతో నేకీభవించినాడు ఇటీవలి పాశ్చాత్య పండితులు వేదముల కాలమును మఱియు మఱియు తగ్గించుచుండిరి ఇక మన భారతీయ పండితులు చూడబోయినచో - వేదములు మఱియు నర్వాచీన ములని చెప్పవలెనని యుబలాట పడుచున్నారు ఇంతకును యథార్థమే మనగా వేదము అనాది అది నిత్యము శబ్దమనునది నిత్యము ప్రతిప్రళ యాంతమున శబ్దము పుట్టుచుండును సృష్టి ప్రళయములు పర్యాయముగ వచ్చుచుండును మన గ్రంధములు ఇప్పటి కెన్నియో సృష్టులు ప్రళయములు జఱిగినవనియు, వాని కాలపరిగణనము చేయుట అశక్యమనియు చెప్పు చున్నవి ప్రతి సృష్టికిని ఆరంభమందు నిత్యమైన యీ శబ్దము అనగా వేదము ఋషులకు విన్పించుననియు, అదివారి ముఖతః వెలువడుననియు మన మతము" (శ్రీకామకోటి జగద్గురు బోధలు)

శ్రీవారు చెప్పినట్లన్ని సృష్టుల ప్రళయముల చరిత్రమును చెప్పుట అశక్యమే కాని యిటీవల జఱిగిన సృష్టికాలమును మనవారు పరిగణించిరి అధర్వణ వేదమున బ్రహ్మదినకాలమును 432 కోట్ల సంవత్సరములుగా చెప్ప బడెను బ్రహ్మదినమునకు పదునాల్గు మన్వంతరములుండును మన్వంతర మునకు 71 దివ్యయుగము లుండును దివ్యయుగమునకు 12 వేల దివ్య వత్సరము లుండును దివ్యవత్సరమునకు 360 సామాన్య సంవత్సరము లుండును ఇప్పుడు మనము స్వాయంభువ, స్వారోచిష, ఔత్తమ, తామస, రైవత, చాక్షుసములు గడచి ఏడవదగు వైవస్వత మన్వంతరమున నున్నాము సృష్టిలో మొదటి యార్యుడు స్వాయంభువమనువు "

From these authorities, it is established that the day on which Brahma opened his eyes was Adivara (gradually

Adityavara) and the movement is ' Bramhimuhurta ' Pratipat of the Suklapaksha of the month of ' Chaitra ' of the Chandramana or of the month 'Mesha ' of the Suryamana. This month has taken the name 'march' with the occidental astronomers of ancient renown, for the reason that the planets have begun their first march in this month It is not uncommon that ' Chaitra Sukla pratipat ' often falls in the month of March and it is no wonder to say that the month of March had had its reckoning as the very first month of the year before the Christian torture of the oecidental Calender. The names of the months September, October, November, December, bare testimony to the fact that the month of March had once had the reckoning as the first Month of the year for the reason shown above . . We proclaim to the world at large that the world has run a career of 195, 58, 85, 030 years from the opening of the eyes of Brahma, the prajapati, in "Brahmavarta " to the present day of observations (in 1929) . . . In fact, the history of Bharata Varsha, is the history of humanity at large, from the begining of the world (Epohs of the History of Bharata Varsha by Jagadguru Sri Sri Kalayananda Bharati Swamiji)

మెట్కాఫ్ దొరగారు శ్రీకూచి నరసింహముగారికి పూర్వము ఆంగ్లేయుల మాసము 'మార్చి' తోడనే ప్రారంభింప బడెడిదనియు, వారికి మార్చి నుండి డిసెంబరు వఱకు పదిమాసములే యుండి యుండెడి వనియు, అందులో మార్చి నుండి జూలై వఱకు వారి దేవతల పేర్లకు సంబంధించిన వనియు, అట్టివే జనవరి, ఫిబ్రవరి నెలలకు కూడ తర్వాత పెట్టు కొనినారనియు చెప్పినారని శ్రీదర్భా సర్వేశ్వరశాస్త్రిగారు నాతోననిరి ఆగస్టు నుండి డిసెంబరు వఱకును మాసముల పేర్లు సంఖ్యావాచకములుగ కన్పించుచున్నవి వేదకాలమను నది యొకటి యున్నయెడల నప్పటి నుండియు సంస్కృతభాష స్థితికలదని తేలుచున్నది అనగా సృష్ట్యాదినుండియు నీభాష కలదన్నమాట ఇప్పటిది శ్వేతవరాహ కల్పము కల్పప్రళయము

జరిగిన పిదప ఏర్పడిన కల్పమిది అనగా కనీసము సుమారు పండ్రెండు కోట్ల సంవత్సరముల నుండి యైనను ఈ భాషకు అస్తిత్వముకలదని చెప్పికొనుటలో విప్రతిపత్తి యుండబోదు

## సంస్కృతము మృతభాషయా?

సంస్కృతము 'మృతభాష' యనెడి వారును కొందఱు కలరు మృత భాష యనగా చచ్చిపోయిన భాషయని యర్థము పండ్రెండు కోట్ల సంవత్సరముల నుండి వచ్చుచు నిప్పటికిని యాకాశవాణి కేంద్రములలో ప్రసారమగుచు, పాశ్చాత్యులును అభ్యసింప నుత్సహించు భాష మృతభాష యెట్లగును? అమృత భాషయే యగును దీనికి దేవభాష యనియు పేరున్నదికదా? దేవత అమర్త్యులుకదా? కనుక ఇది మృతభాష కాదు సన్ధ్యావందనమును దేశభాషలలో చేయుట లేదుకదా! సంస్కృతభాషలో నే యిప్పటికిని చేయుచున్నారుకదా! దేవాలయములలో పూజలు, సంకల్పము సంస్కృతభాషలోనే జరుగుచున్నవికదా? తీర్థములలో స్నానమాడు నప్పుడు సర్వులకును సంస్కృతభాషయే యుపయోగింపబడు చున్నదికదా! ఉపనయనము, వివాహము, అపరకర్మాదు లన్నియు సంస్కృతభాషలో నే జరుగుచున్నవి కదా! స్వర్గీయ శ్రీశాంతి రామమూర్తిగారు చెప్పినట్లు సంస్కృతవ . మన జీవితములో నొకభాగమయి ఆ భాష మన రక్తనిష్ఠమై యున్నది భారతదేశ మెంత వఱకు భారత దేశమో సంస్కృతభాష యంత కాలము మన భాగనే యుండును దేశ భాషలలో సైతము పెక్కుపదములు సంస్కృతీయము లేరదా! సంస్కృత భాషలో పురాణము వినువారికి తద్భాభాషానభిజ్ఞులైనను నదియర్థమయి నట్లే భాసించుటలేదా? పత్రికాధిపతులును క్లిష్టీకరణముకై శీర్షికలలో సంస్కృతభాషనే యుపయోగించుచున్నారు కదా! కనుక ఈ భాష కీదేశములోని స్థితి విదేశములలో గ్రీకు, లాటినుల స్థితి వంటిదికాదు

"Any audience in India consisting of people proficient in a regional language can understand a speech delivered in simple Sanskrit, while the counterpart in Europe cannot pick up the head and tail of a Greek speech Hundreds of Sanskrit proverbs like " యథా రాజా తథా ప్రజా" and "నదీనాం

సారో గతిః" are understood by even the illiterate in India while Greek and Latin proverbs are Greek and Latin to the generality of the europeans. I surmise that it exactly the reason why our patriotic leaders that framed the constitution never used that word (Secular) (Indian Express, 4-6-69. Sri J Purushottam )

పరభాషా పాలనవలనచే మన విద్యలకు న్యాయమైన పోషణము జరుగలేదనునది వాస్తవమే అట్టి సమయమందును మన దేశమున వేద విద్య నశింపలేదు పురాణేతిహాసములు నశింపలేదు ఏ కొందరో కడుపు కక్కుర్తికై యన్యభాషాభ్యాసనము చేసినను, వారును తమ గృహములలో యథాశక్తి సంస్కృతభాషాభ్యాసనమును చేయ లేదనుటకు వీలులేదు సంస్కృతభాషను బోధించుటకు శుల్కమును తీసికొను ఆచార మింతవరకు వచ్చుటలేదు కొందరన్యభాషల నభ్యసింపక వేదమూర్తులును శాస్త్ర మూర్తులునునైరి జాతీయోద్ధరణమున త్యాగము చేసిన వారికెంత విలువ కలదో, జాతీయ విద్యయైన సంస్కృతమును పోషించి, అన్యభాషాభ్యాసనము వలన రాబోవు ధనమును తృణీకరించిన వారికంతే విలువ కలదు

## సంస్కృతము ప్రజల భాషగ నెప్పుడైన కలదా ?

సృష్టియైనప్పుడు, వేరు భాష లేనప్పుడు, ఉన్నది సంస్కృతభాషయే యైనప్పుడు వారా భాషలో మాట్లాడక వేరొక భాషలో నెట్లు మాట్లా డెదరు? కనుక చాల ప్రాచీన కాలమున నది ప్రజల వ్యవహారభాషగ నుండి యుండుట స్పష్టము సర్వుల భాషయు నదే భాషయను మాటలోనే వ్యవహారలక్షణము స్ఫురించును పాణినికృతాష్టాధ్యాయియే దీనికి నిదర్శనము, 8-2-82, 8-2-83, 8-2-84, 8-2-85, 8-2-86, 6-1-29 సూత్రములలో మనకా విషయము బోధపడును పాణిని ప్రత్యభి వాదనము, దూరాహ్వానమును గూర్చి చెప్పినప్పుడు భాషకు వ్యవహారస్థితి యంగీకరింపక తప్పదు "Panini call his language 'Bhasha' (i e ) the spoken language, his reference to dialectical peculiarities and rules governing speaking, leave no doubt about Sanskrit having been the spoken language (Sri V Raghavan-talk broadcast over All India Radio on Sanskrit literature).

పాణినికాలమును చరిత్రకారులు తగ్గించిరి 1400 B. C గా "Age of Buddha, Milında, Amtıyoka and Yugapurana" అను గ్రంథమున వ్రాయబడినది పాణినికిపూర్వమే ఐన్ద్రి, మాహేశ్వర వ్యాకరణములున్నవి

## సంస్కృతము రాజ భాషగానున్నదా?

ప్రాకృతము లెప్పు డేర్పడినవో యప్పుడే సంస్కృతమునకు సర్వ జనులును మాట్లాడుస్థితి తొలగి పోయినది రెండు వేల సంవత్సరముల కొకమాఱు భాషలో మార్పులు జఱుగుననియు, 'ఓల్డు ఇంగ్లీషు' ఈ నాడర్థము కానట్లే సంస్కృతము దేశభాషగానే నిలిచినచో మన మహర్షుల భావములు మన కర్థమయ్యేడివి కాదనియు, వ్యవహారబాహుళ్యమయిన భాష త్వరగా చచ్చిపోవుననియు కొందఱు పెద్దల యభిప్రాయము సర్వ జన వ్యవహారము నుండి తొలగుట సహజము కనుక సంస్కృత మట్లు తొలగినది కాని యేయొక్క భాషయు భారత దేశమంతటను ప్రజలచే మాట్లాడబడుటలేదు కదా! అప్పుడది ప్రజల భాషగా కాక పండితుల భాషగను, రాజ భాషగనునైనది దేవతల కిప్పుడును నది వ్యవహారభాషయే మహమ్మదీయ ప్రభుత్వము నందు మాత్రమే సంస్కృతము రాజభాషగా నుండుట తొలగినదని డాక్టర్ సి పి రామస్వామి అయ్యరుగారు వచించిరి "The fact that Sanskrıt was for many centurıes regularly used ın conversatıon by the upper classes and court cırcles cannot be denıed Changes to the dısadvantages of Sanskrıt as a spoken language resulted from thc Mohammaden ınvasıons whıch culmınated ın the substıtutıon of a new speech whıch came ınto offıcıal use at the court of the Muslım rulers But untıl 1200 A D there ıs lıttle evıdence ın the fundamental change ın the extent or character of the use of Sanskrıt About the 11th century, a very learned scholar and astronomer, 'Al Berunı' came to Indıa ın the traın of Mohammad Ghaznı He mastered the Sanskrıt language and produced a treatıse entıtled "An enquıry ınto Indıa" (Thakık-e-Hınd) . makes ıt clear that ın hıs days Sanskrıt was largest spoken language"మాక్సు ముల్లరుగారు

కూడ భారతదేశ మంతటను మాట్లాడు భాష నేటికిని సంస్కృతమే యని చెప్పిరి "Such is the past and the present of India, that inspite of repeated social convulsions, religious reforms and foreign invasions, Sanskrit may be said to be still the only language that is spoken over the whole extent of the vast country" ఈ సందర్భము ననే M Winternitz గారిట్లు వ్రాసిరి "Sanskrit is not a dead language even today There are still at the present day a number of Sanskrit periodicals in India and many topics of the day are discussed in Sanskrit pamphlets, The Ramayana and The Maha Bharata are still read aloud and listened to with rapt attention, poetry is still composed and works written in Sanskrit and it is the language in which Indian Scholars converse upon technical questions. Sanskrit atleast plays even today the same part in India as Latin in the Europe of the middle ages or Hebrew with the jews";

కనుక సంస్కృతము కొంత కాలము ప్రజల భాషగను, కొంత కాలము రాజభాషగను, ప్రస్తుతము పండితుల, కవుల, భాషగను నుండననుట స్పష్టము, భారత దేశము నందంతటను నేటికిని సభలలో మాట్లాడబడు చున్నది ఒక ఆంగ్లమును కాని హిందీనికాని భారతదేశపు పలుప్రాంత ముల వారు తమ భాషగా భావింపరు సంస్కృతమునే భావింతురు కారణము దేశ భాషలలో కూడ నా పదములకుగల చలామణియే ఇంటిలో తల్లిదండ్రులు కూడ సంస్కృతము మాట్లాడు కొనుటచే పిల్లలకును నా భాష సులభగ్రాహ్యమగు కాలము కూడ నున్నది

కాత్వం బాలే ? కాంచన మాలా
కస్యాః పుత్రీ ? కనకలతాయాః
హస్తేకింతే ? తాళీ పత్త్రం
కావా రేఖా ? కా ఖా గా ఘా

వంటి శ్లోకములు ప్రచారములో నున్నవి

## సంస్కృతము దేశ సమైక్యసాధనమా ?

సంస్కృతమునకు భాషా విషయకమైన గొప్పతనమే కాక యేకీ కరణశక్తియుకలదని శ్రీయుతులు మున్షీ, దివాకర్, ప్రభృతులనేకు

లంగీకరించిరి "The Union Government is fully aware of the importance of Sanskrit as a Potential factor in National integration" (శ్రీ వి ఆర్ కె వి రావు) కారణము ఆ భాషకును మన సంస్కృతికిని యవినాభావ సంబంధముండుటయే "బెంగాలీలు, మరాఠీలు, గుజరాతీలు, తమిళులు, ఆంధ్రులు వారి ప్రత్యేకతను కాపాడుకొనుచువచ్చిరి కాని యందరిలోనను ఒకే భారతీయత ఉండుట విశిష్టత జాతీయ సంప్రదాయములు, నైతికసూత్రములు, మానసిక ప్రవృత్తులు, ఆచార వ్యవహారములు, మంచిచెడ్డలు, అందరిలోనను ఒకే మాదిరిగనున్నవి నిత్య[illegible]లోనను, దానికి సంబంధించిన సమస్యల యెడలను ఒకవిధమైన ఆధ్యాత్మిక దృక్పథము అందరిలోనను ఒకేవిధముగ ప్రస్ఫుటమగుచున్నది ఈ సంప్రదాయములో ఏదో ఒక సజీవమైన మహత్తరశక్తియున్నది" (శ్రీ నెహ్రూగారి భారతదర్శనము-అనువాదకులు శ్రీ బి యస్ మూర్తి, కొర్విపాడి లింగరాజుగారలు) ఆమహత్తరశక్తి సంస్కృత భాషాగతమైన సంస్కృతియే

క్రీ శ 1937లో తిరువనంతపురములో ప్రాచ్య భాషా పరిషత్తున కధ్యక్షుతవహించిన, మతాంతరులైన శ్రీ యఫ్ యఫ్. థామస్‌గారిట్లు వచించిరి "సంస్కృతము భారతదేశములో గొప్ప ఏకీకరణశక్తిగ నుండెడిది ఒక సరళరూపములో నుండు సంస్కృతమును (Basic Sanskrit) నేటి భారత దేశమున కంతకును వాడుక భాషగా ప్రోత్సహింపవలసి యున్నది . . , ఇండియాలో గతమునకును వర్తమానమునకును నంతరాయములేని సంబంధ సూత్రము దృఢముగ నున్నది అనేక సాంఘిక భూకంపములు, మత సంస్కరణములు, వైదేశిక దండయాత్రలు జరిగినప్పటికిని సంస్కృతమే యీ విశాల దేశమంతంటికిని, ఇప్పటికిని, వాడుకలో నున్నదనియే చెప్పవలెను ఇదే అద్భుతమైన సూత్రము ఒక శతాబ్దముపాటు ఆంగ్ల పరిపాలనము, ఆంగ్లభాషా బోధనము జరిగిన పిదప, ఇప్పటికిని సంస్కృతము అర్థము చేసికొనబడుచున్నదనియు, డాంటేకాలములో యూరపులో 'లాటిను' భాషను అర్థముచేసికొనగల్గినవారికంటె, ఈసంఖ్యేఎక్కువనియు నానమ్మకము దక్షిణ భారతములో ఇది మఱియు నెక్కువని నానమ్మకము నేటి"ఉర్దూ"భాషలో కూడ నూటికి ఎనుబది పదములు సంస్కృతము నుండి పుట్టినవే నేటి 'థాయిలెండు' లో సాంకేతికశాస్త్రీయ పదములను, ప్రభుత్వపు అవసరము

లకు కావలసిన పదములను, వారు సంస్కృతము నుండియే పరివర్తించు కొనెదరు ఇదెంత లక్షింపదగిన మహా విశేషము!" ఈవాక్యములచే భారతీయుల నైక్యముచేయు సాధనము సంస్కృతమని గ్రహింపవలసి యున్నది దక్షిణ భారతమున సంస్కృతము నర్థము చేసికొనువారి సంఖ్య యెక్కుడగుటకు హేతువును సర్దార్ యమ్ పణిక్కరుగారిట్లు రూపించు చున్నారు "The boundaries of India are fixed by nature India is equal in size to Europe minus Rassia No other Mountains in the world have contributed so much to shape the life of a country as the Himalayas in the case of India Even when the Gangetic valley fell under the domination of foreign culture as it often did during the last 2000 years Hindu civilization was firmly entrenched in the South to maintain the continuity and provide inspiration for a general revival."

శ్రీ విన్సెంటు స్మిత్‌గారు కూడ సంస్కృతమునకు గల ఏకీకరణశక్తిని యొప్పికొనక తప్పలేదు This unity reflected in the adherence of the Hindus to 'Varnasrama Dharma' their recognition of the authority of the Vedas, their reverence to Itihasas and the Bhagavadgeetha, their common devotion to places of pilgrimage and above all their regard for Sanskrit. Even the daily prayer of a pious Hindu recalls to his mind the image of his Mother-country as the land of sacred rivers and cities scattered to the length and breadth of India V A Smith remarks "The pious pilgrim when going round of holy places is equally at home among the snows of Badarinadh or in the burning sands of Rama's Bridge." The unquestioning predominence attained by Sanskrit form the Himalayas to the Cape, completed the cultural unity of India (Indian History and Culture)

శ్రీ నెహ్రూ ఆదిశంకరులను గూర్చి వ్రాయుచు "The very conception of these journeys and his meeting kindered souls everywhere and speaking to them in Sanskrit, the common language of the learned throughout India, brings out the essential unity of India even in those far off days" అనినారు

## సంస్కృత భాష ఆక్షేపణములు.

వాస్తవమునకు దేశీయ ప్రముఖులును, వైదేశిక విద్యావేత్తలును సంస్కృతభాషనంతగా ప్రశంసించిన పిదప సంస్కృత భాషాభివృద్ధి నిగూర్చి భిన్నాభిప్రాయముండుట కవకాశమే లేదు కాని యచ్చటచ్చట దీనిని గూర్చి యపశ్రుతులు విన్పించుచున్నవి సంస్కృతమునకు ఛాందసమునకును రక్త బాంధవ్యమున్నట్లు కన్పట్టుననియు, సంస్కృత మితర భాషలవంటిదే కాని దానికి ప్రత్యేకత లేదనియు కొందఱి యభిప్రాయము ఛాందసమనగా వైదికమని యర్థమయినచో నది ప్రశంసింప దగినదే కాని నిరాకరింపదగినది కాదు లోక వ్యవహారజ్ఞతా శూన్యతయని యర్థము చెప్పికొనవలసివచ్చి నచో, అర్థశాస్త్రాది మహా విషయములు, రాజనీతి మొదలగునవి సంస్కృత గ్రంథములయందే యున్నవి వాని నతిక్రమించి యే యితర భాషలోను చెప్పబడియుండలేదు ఇక సంస్కృత మితర భాషలవంటిదే యనుట విచా రించి యన్నమాటకాదు దాని నిర్మాణమే యద్భుతమని యాభాషను గూర్చిచేసిన ప్రశంసనములు ముందే యుదాహరింప బడినవి సంస్కృతము నకు సాటి సంస్కృతమే కాని వేఱొకభాషకాదు

వర్తమానకాలములో సంస్కృతభాషయొక్క ప్రయోజనము శూన్య మనియు, సంస్కృత కమిషన్‌వారు ఒకానొక జీవన విధానమునకు సంస్కృ తము ప్రతిబింబమని ప్రశంసించిరనియు, ఆ జీవిత విధానము వలన ప్రజలకు 'శాస్త్రిరీత్యా' సమాన హక్కులు లేకపోవుననియు, ఆ జీవితవిధానమువల ననే కులవ్యవస్థ తలయెత్తినదనియు నొక యాక్షేపణముకలదు దీనినిగూర్చి చక్కగా విచారింపవలసి యున్నది సంస్కృతము పుట్టినగడ్డ ఇది అనగా ఆభాష మనజాతిభాష మనజాతిభాషలోని యౌన్నత్యమును గమనించి వైదేశికులే యభ్యసించుచుండగా మనజాతికి దానివలన ప్రయోజనములేదను కొనుట అర్థరహితమైనది. మనపెద్దలైన శ్రీయుతులు ఆనే, కట్జూ, శ్రీప్రకాశ్, పట్టాభి,కరియప్ప ప్రభృతులుప్రాథమికదశనుండినిర్బంధముగ భారతీయ విద్యా లయములయందు సంస్కృతమునేర్పబడవలెనను అభిప్రాయమును వెలిబుచ్చిరి రెండు దశాబ్దములకుపైగా ప్రజాస్వామ్య పద్ధతిని దేశములో పరిపాలనము జఱుగుచున్నది స్వరాజ్య సంపాదనమునకు సంస్కృతభాషాభ్యాసముగాని వర్ణవ్యవస్థకాని యాటంకముకాలేదు ఇప్పుడును (సంస్కృతభాషాభ్యాసనము

వలన) సమానహక్కులను ప్రసాదించిన రాజ్యాంగ శాసనము రద్దగుటలేదు. ప్రజాస్వామ్యములో ప్రతి మతమునకును రక్షణము కలదు అట్టిరక్షణమే హిందూమతమనబడు దానికిని కలదు. హిందూమతానుసారి యైనజీవిత విధానమున కిదివఱకే రక్షణయుండగా, మనము సంస్కృతము నభ్యసించుట మానివేసినను, ఆ రక్షణము పోవుట కవకాశములేదు. హిందూమతములో వర్ణవ్యవస్థ లేదనుటకు వీలులేదు. అది యుండిననేకదా – యదిపోయిన బాగుండుననుకొనుటకవకాశము కలుగునది! ఇదివఱకే లేకుండినచో లేనిది పోవలెననుకొనుటలో నర్థములేదు సంస్కృతభాషలో వర్ణవ్యవస్థనుప్రస్తా వించు గ్రంధము లున్నవి కనుక, నా భాషలో నా గ్రంథములు చదివినచో వానియందు ప్రత్యయము కలుగునుగనుక నా భాషయే చదువకుండనుండిన మంచిదను అభిప్రాయముతో నా భాషకు వ్యతిరేకతను తెలుపుచున్నారన వలయును అట్టిచో నాంధ్రభాషయందును భారతము, భాగవతము, రామా యణము, వసుచరిత్రము, విజయవిలాసమువంటి గ్రంధములలో వర్ణములను గూర్చిన విషయములు కలవు కదా! కనుక ఆంధ్రభాషనుకూడ నభ్యసింపరా దనవచ్చును కదా! దీనిని సరియైన అభిప్రాయముగా స్వీకరింపనగునా? అది యునుగాక సంస్కృతములోన కంటె దేశభాషాగ్రంథములే సులభముగ ప్రజలకు బోధపడును కనుక దేశభాషలనే తొలిగా కాదనవలసివచ్చును. ఇది సరియైన ఆక్షేపణము కాదు

వర్ణవ్యవస్థను కాదనువారి గొంతుకలు పెద్దవి కాని, వారుసంఖ్యలో మిక్కిలి తక్కువ అట్లనువారును, వారి పుత్త్రికలకు వివాహముచేయు సందర్భమున తమకంటె తక్కువకుల మనబడువారికి పిల్లనీయరు పిల్ల కిష్టములేదనియో భార్యకిష్టములేదనియో, లేక పిల్లమేనమామకు కోపము వచ్చి చుట్టఱికమును తెగతెంపులు చేసికొనుననియో చెప్పి వర్ణాంతర వివా హమును చేయుటను తప్పించుకొందురు స్వభావసిద్ధముగ జఱుగు వర్ణాంతర వివాహములను ఎవ్వరును నిరోధించుటలేదు. వారట్లు చేసికొనుటకు శాప కారణమగుటలేదు వారి విశ్వాసము ననుసరించి వారు చేసికొనుచున్నారు వర్ణవ్యవస్థయందు విశ్వాసముగల ప్రజల ఆచార వ్యవహారములు ప్రజా స్వామ్యమున కవరోధమగుట లేదు మతము వలనకీడు కలుగదనియు, ఉగ్ర నులు మొదలైనవారి పాలనములోని కీళ్లువారు నమ్మిన మతము వలనకాక, వారి యల్పజ్ఞత వలన కలిగినదనియు, వారునమ్మిన మతమునే యుపయోగించలు

సమ్మి, పశ్చిమాసియాలోనను ఐరోపాలోను 10, 14 శతాబ్దముల నడుమ జ్ఞాన దీపమును వెల్గించిరనియు అల్బెరూని, అబుల్ ఫజల్, ఫైజీప్రభృతులు మతముకారణమనువారి వాదమును ఖండించిరి కనుక మతము కాని, దాని నాశ్రయించిన భాషకాని యభివృద్ధి నిరోధకము కాజాలదు

"It cannot be said that the culture enshrined in Sanskrit language is irrelevant to modern conditions" అని రాధాకృష్ణ పండితులు (అప్పటి రాష్ట్రపతి) విశ్వసంస్కృత పరిషత్తు సమావేశంలో (బెంగుళూరు) చెప్పియుండిరి మన దేశరాయబారియైన జి ఎల్ మెహతా గారిట్లు చెప్పినట్లు ప్రచురింపబడినది "Asian countries will have to evolve their own patterns of democracy Their back-ground, their tradition and their culture, their economic conditions and ways of living are radically different from those of the Western World Their economy is based primairly on land, and the village is still a pre-dominating factor in the lives of millions of human beings. So even if there is antagonism between democracy and caste-system, yet caste being the older institution, it is but proper that democracy should be so shaped as to suit the already existing social structure, and not vice-versa We make the cap so as to fit the head, We do not reshape the head so as to fit the cap (Statesman 12-8-55) దీనినిబట్టి వర్ణవ్యవస్థ ప్రజాస్వామ్యమునకు నవరోధము కాదని తేలు చున్నదికదా? వర్ణవ్యవస్థ పోవలెనను అభిప్రాయము కలవారు, దానికి హేతువులు చెప్పుట న్యాయముకాని, ప్రజాస్వామ్యము తోడనో లేదా సంస్కృత భాషతోడనో ముడిపెట్టరాదు

మదరాసు హైకోర్టు జడ్జిగారయిన W S కృష్ణస్వామి నాయుడు గారు శ్రీ కె వి సుందరేశ అయ్యరుగారి "డెమోక్రసీ అండ్ కేస్ట్" అను గ్రంథమున కుపోద్ఘాతమును వ్రాయుచు The author's suggestion therefore that the caste-systemshould be left to itself to live or die according to its vitality depending upon the progress made and that any attempt by the state to their total abolition by any drastic legislation is not warranted or practicable, is well worth the consideration

of all fair minded persons interested in the moral welfare and social solidarity of the Hindu community" అని హెచ్చరించిరి సంస్కృత భాషాధ్యయనమును కులముతో ముడిపెట్టుటను గూర్చి ప్రసిద్ధ పత్రికాధిపతులు శ్రీ ఫ్రాంక్ మొరేస్ గారు" To put matter bluntly, Sanskrit has become a victim of prejudices. In Tamil Nadu it is assosiated quite wrongly with a particular caste and also with what is called North Indian culture and it shares the odium these have incurred in certain circles. Propaganda has created a rival to Sanskrit in Tamil. The odium is uncalled for and the rivalry is purely imaginary. (Indian Express-Editorial 26–3–69) అని వ్రాసిరి

కుల వ్యవస్థ తల యెత్తిన జీవిత విధానము నాక్షేపించునప్పుడు మనజీవిత విధానమును గూర్చి శ్రీగాంధిగారేమి చెప్పిరో గమనించుట అవసరము "I believe that the civilization in India as evolved is not to be beaten in the world Nothing can equal the seeds sown by our ancestors Rome went, greece shared the same fate, the might of the Pharavos was broken; Japan has become westernised, Of Chaina nothing can be said, but India is still some how or other sound at the foundations. The people of Europe learn their lessons from the writings of the men of Greece or Rome which exist no longer in their former glory In trying to learn from them, the Europeans imagine that they will avoid the mistakes of Greece and Rome Such is their pitiable condition. In the midst of all this India remains immovable and that is her glory In no part of the world, under no civilization have all men attained perfection The tendency of the Indian civilization is to elevate the moral being, that of the Western civilization is to propagate immorality The latter is godless, the former is based on a belief in God" జాతీయత యనునది సర్వదాయుండవలెను కాని కేవలము రాజకీయముల వఱకే పరిమితమైయుండరాదు సంస్కృతము మన జాతిభాష, మనము కాదన్నను వైదేశికులు మన జాతిభాషయనక యూరకొనరు జాతీయతను గూర్చి యరవిందుల యభిప్రాయమును పరిశీలించునది "There is a creed in

India to-day which calls itself Nationalists This is a creed which many of you accepted when you called yourself Nationalists Nationalism is not a mere political programme, Nationalism is a creed which you shall have to live If you are going to be Nationalist, if you are going to assert to this religion of Nationalism you must do it in the religious spirit" (who is true Nationalist?) అందు చేత జాతిభాషకు వ్యతిరేకులైనవారి జాతీయత శంకింపదగినది మతము జాతీయతకు భిన్నమైనది కాదని శ్రీమాన్ రాజగోపాలాచార్యులవారు చెప్పుచునేయున్నారు కేవలము సైన్సు వంకనే దృష్టినిలిపి మతమును అముఖ్యమను కొనుటలోని దోషమును రాధాకృష్ణ పండితు లిట్లెత్తి చూపుచున్నారు "Many people who live in this science-dominated society claim that scientific knowledge would bring with it perpetual progress, a steady improvement in human relations To remake ourselves Humanities which cover art and literature philosophy and religion are as important for human welfare as science and technology " అందు చేతనే కదా మాక్సు ముల్లరుగారు "Sanskrit literature is full of human interests" అని వచించినది మానవునికావలసిన విషయము లన్నియు సమగ్రముగ సంస్కృత సారస్వతములో నుండగా నాభాష నప్రశస్త్యముగ జూచుట న్యాయముకాదు మత విషయము లున్నవికదాయని సంస్కృతముపై కోపగించుట ప్రయోజనకారి కాదు జాతీయత, మతము, అనునవి జాతికి జీవగఱ్ఱలు 11-10-69న, యాబదివేలు జనులుకల సభలో నహమ్మదాబాదున ఖాన్ అబ్దుల్ గఫారఖాన్‌గారు (బాద్షాఖాన్) జుమ్మా మసీదులో నుపన్యసించుచు, "There are paths of progress-Religion and Nation-hood The secret of the progress of Western Countries is they followed religion as well as Nation-hood" అనిరికదా! కనుక జాతీయతతోపాటు మతమును ఉపాదేయమే పాశ్చాత్యులు సంస్కృతము నభ్యసించు నప్పుడాభాష వలన వారిలో వర్ణవ్యవస్థ నేర్పడునని వారు భయపడుటలేదు పాశ్చాత్యులభ్యసించినట్లయినను దేశీయు [illegible]చ్చును కదా? ఉర్దూభాష వలన షియా సున్నీ విభాగము వచ్చినదా? ఆంగ్ల భాష వలన కేథొలిక్ ప్రొటెస్టెంటు విభాగము వచ్చినదా?

దౌర్జన్యములతో పరస్పరాపకార మొనర్చుకొనినది? వారిద్దఱును ఒకే మతమునకు చెందినవారు కదా! భారత దేశములో నెచ్చటనయినను నొక రాష్ట్రమున నొకకులము వారందరును నొక వంకయు మఱొక కులము మఱొక వంకయు నుండి యుద్ధము చేయుట చరిత్రలో చూచియున్నామా? రాజ్యంగ శాసనము జాతి మత కుల లింగవివక్షలేని సమానావకాశము లొసంగినది ఒకరినొకరు చిన్న చూపుచూచుట, ద్వేషించుటయనునవి మానవులతో వ్యక్తిగత దౌర్బల్యములు ఇవి ప్రపంచమంతటను నున్నవి ఏకఫలాపేక్ష కలిగినపుడు కులమునో మతమునో యడ్డముపెట్టుకొనుట స్వార్థపరుల లక్షణముకాని సంస్కృత సాహిత్యమునకు సంబంధించినదికాదు ఆ సాహిత్యము మానవులనేకాక సర్వప్రాణులలోని యాత్మ యొక్కటే యను అద్వైతభావము కలిగించునది దానినర్థము చేసికొనక పోవుటచే ననర్థములు కలుగవచ్చునుకాని యాభాషచే కలుగుటకు వీలులేదు ఒకే భాషమాటాడువారు, ఒకే మతమునకు చెందినవారు దౌర్జన్యములకు దిగుట యా భాషలోని లోపమా? ఆ మతములోని లోపమా? వ్యక్తులలోని దోషము లట్టి పరిస్థితులకు దారితీయును వర్ణవ్యవస్థపై చిరాకుపడిన శ్రీ నెహ్రూగారును తమ భారత దర్శనమున నిట్లువ్రాసిరి" సర్ జార్జ్ బర్ట్ ఉడ్ ఎచ్చటనోయిట్లనెను—హిందువులు వర్ణవ్యవస్థను పాటించినంత వఱకు భారతదేశము భారతదేశముగనే యుండును, దానిని కూలద్రోసిన నాటినుండి యిక భారతదేశమే యుండదు ఆ గొప్ప ద్వీపకల్పము, ఆంగ్లోసాక్సను సామ్రాజ్యపు తూర్పుముక్క మాత్రమేయగును—అతడు చెప్పిన దానిలో కొంత సత్యము కలదు ఒక పెద్ద ప్రాచీన సాంఘిక వ్యవస్థను కదలించునప్పుడు, దానిస్థానమున ప్రజల మనస్తత్త్వమునకు సరి పడినది, మరియేదియైనను నిర్మాణముండినకాని, లేనిచో సాంఘిక జీవనము పూర్తిగకూలిపోయి, గట్టితనముపోయి, ప్రజలకు బాధ, వ్యక్తిగతమైన నడవడికలో పెట్టిగ్గు కలుగుటకద్దు మనము దానిని తీసివేసినచో దానిస్థానమున నుంప వలెననుకున్నదానిని గూర్చి ఛాయా మాత్రముగ నైనను మనకొక అభిప్రాయముండుట అవసరము మనము శూన్యత్వమును సృష్టింపరాదు అట్లు సృష్టించినచో మన కిష్టములేని విధముగ నా "శూన్యము" దాని యంతటనదియే నిండవచ్చును మనముచేయు నిర్మాణాత్మకమైన ప్రణాళికలలో, మన మేప్రజలతో వ్యవహరించు

చుంటిమో, వారి యాలోచనములు, అలవాటులు, ఏమో, మనము పనిచేయవలసిన వాతావరణమేమో, వీనినన్నిటిని గూర్చి యాలోచించుట అవసరము అట్లుచేయక, గాలిలో మేడలుకట్టుటయో, ఇతరులు చేసిన దానిని అనుకరించుటయో తెలివితక్కువ పని అందుచేత మన ప్రజల మీద ఇంత బలముగ చెల్లుబాటయిన సాంఘిక వ్యవస్థను గూర్చి తెలిసికొని యర్థము చేసికొనుట అవసరము."

శ్రీ 'సిడ్నీలో' అను వైదేశికుడు తన 'విజన్ ఆఫ్ ఇండియా' అను గ్రంథమున "There is no doubt that it (the caste-system) is the main cause of the fundamental stability and contentment by which Indian Society has been biaced for centuries against the shocks of politics and cataclysms of Nature An India without caste as things stand at present, is not quite easy to imagine" అని వ్రాసెను

శ్రీ 'Abbe Dubois' గారిట్లనిరి "The ancient legislators of India have by the establishment of different castes acquired a Title to glory without example in the annals of the world, for their work has endured even to our day, for thousands of years, and has remained almost without change through the succession of ages and the revolution of empires The endeavours of their conquerers to impose upon them their own modes have uniformly failed and have scarcely left the slightest trace behind them"

శ్రీ 'బెన్నెట్' గారిట్లనిరి, "Their whole social system postulates exceptional intergrity"

సర్ హెన్రీ కాటన్ గారిట్లనిరి "The system of caste far from being the source of all troubles which can be traced in Hindu society, has rendered most important service in the past and still continues to sustain order and solidiarity

శ్రీ శ్రీ శ్రీ కామకోటిపీఠాధిపతుల అభిప్రాయమిట్లున్నది స్థూలముగ చూచినచో వర్ణ విభేదములను మత విభేదములను నిర్మూలింపవలె ననెడియాలోచన న్యాయముగనే కన్పించును మఱి వీనికంటె

యధిక విద్వేషములను భాషాభేదములు, రాజకీయ మతభేదములు కల్పించుచున్నవి కదా! కనుక అసలు భాషనే నిర్మూలించి మూగవారముగనే యుండుటయే మేలని యందమా? మొదలు ప్రభుత్వమనేదానినే రూపుమాపి యాటవికావస్థకు, మాత్స్యన్యాయమునకు తరలి పోవలసినదేనా? ఒకమంచి వస్తువులో కొంత చెట్ట కూడ కన్పించును చెట్టను పరిహరించి మంచినికాపాడు కొనుటయే బుద్ధిమంతుల లక్షణము మత విషయమున, వర్ణవ్యవస్థ విషయమున నీమార్గమే యవలంబింపవలెను ఐరోపీయులగు క్రిస్టియనులు, నీగ్రో క్రిస్టియనులతో సంబంధ బాంధవ్యము లొల్లరు ఆకారణమున క్రైస్తవ మతము పనికిమాలినదని రూపుమాపవచ్చునా? వర్ణమునుబట్టియు పదవినిబట్టియు నెవ్వరును అహంకరింపరాదు భక్తి, జ్ఞాన, ధర్మములు వేరు తన్నుకొనినచో వాని యంతట అవియేవెనుకబడిపోవును భక్తులపట్ల, జ్ఞానులపట్ల, వర్ణ భేదము చేయక వారినారాధించెదము మహాత్ములైనవారు తమ్ముతాము పరమాణువులుగా నెంచుకొనెదరు మనశాస్త్రములు, వర్ణాంహాకృతి దూష్యము, పాపము, అని చెప్పుచున్నవి ఏవర్ణమునకు విహితమైన ధర్మము లావర్ణము శ్రద్ధాభక్తులతో నాచరింపవలెనేకాని, స్వవర్ణాభిమానము వహింపరాదు మతమను పెద్ద మోపులో ఇమిడినవే వర్ణములను చిన్నకట్టలు, పరస్పర సహాకారభావముతో, ద్వేషమాత్సర్యముల విడనాడి స్వక్షేమము, సమష్టి క్షేమము సాధించుటకే మత వర్ణము లేర్పడినవి ''

శ్రీవారి యభిప్రాయము మాన్యమయినది కదా! శ్రీవారి పీఠాధిరోహణ షష్ట్యబ్ద్యుత్సవ సందర్భమున జూరిచ్‌నుండి 'పాల్ బ్రంటన్'గారు సందేశమును పంపుచు శ్రీవారినిగూర్చియు మనమతమునుగూర్చియు నేమనిరో తిలకింపుడు **"He is an upholder of religious values, which would be regrettable for India to loose under pressure of modern life, with its industrialism and materialism Those scientifically educated young Indians who has no use for their own religion and regard with disdain, should take a lesson from the west, which has gone through an equivalent experience already, but now has to retrace its way" (God on earth - Indian Express – 19–2–67).**

వర్ణవ్యవస్థ దోషముకాదనియు, గుణమేననియు, పాశ్చాత్య పండితులును దేశీయపండితులును చెప్పుచుండగా, సంస్కృతభాష వలన వర్ణవ్య

వస్థ బలపడుననను అభిప్రాయమునకు విలువనీయవలసిన అగత్యము లేదు "అయినప్పటికిని ఆ మతగ్రంథములను చదువక తప్పలేదు వానిని తెలిసికొనకపోవుట ఒక సద్గుణముకాదు, తెలిసికొననిచో నష్టముకూడ నున్నది ఆ గ్రంథములు కొన్ని మానవసంఘముమీద అద్భుతమైన ప్రభావమును ప్రసరింపచేసినవి అంతటి ప్రభావము గల గ్రంధములలో నేదియోనొకమహత్తరమైన, నిరుపమానమైన జీవశక్తియుండి తీరవలెను" అని శ్రీనెహ్రూగారనిరి

శ్రీనెహ్రూగారికి కాళిదాసునందత్యంతమైన అభిమానముకలదు "మానవాతీతమైన జీవితములోని ఘనతను, దాని విలువను గ్రహింపగలిగిన పుడే మానవుడు పరిపూర్ణస్థితికి చేరుకొనును – అనుసత్యము కాళిదాసు అయిదవశతాబ్దములోననేయవగాహనము చేసికొనెను యూరపు19వ శతాబ్దమువఱకును దీనిని తెలిసికొనలేదు ఇప్పటికిని పూర్తిగానర్థముచేసికొనలేదు కాళిదాసీసత్యమును అన్వేషింప గలిగెనన్నచో నదియే యతని మేధకెనలేని పాగడ్త గొప్పకవితకు రూపశైలియెంత అగత్యమో, ఈ జ్ఞానముకూడ అంతఅవసరమే" (భారతదర్శనము)

## సంస్కృతము : వైదేశికులు ·

కొందఱకు మనదేశములో సంస్కృతముపై ఉదాసీనభావముండగా, వైదేశికులకు దీనియందాసక్తి హెచ్చినది **"In Contrast to the indifference to Sanskrit literature in the land of its origin, there is growing interest in the subject in the west It has a fine body of humanistic literature (Editorial - Indian Express–15–5–69)**

సర్ విలియమ్ జోన్సు 1784 (క్రీశ)లోనే సంస్కృతభాషను పరిశంసించెను 1789లో నాతడు కాళిదాసుని శాకుంతలము నాంగ్లములోనికనువదించువఱకును, భారతీయనాటకకళను గూర్చి యాంగ్లేయులకు తెలియదు ఆ గ్రంథము వివిధ ముద్రణము లాభాషలో నందగా దానినుండి జర్మన్, ఫ్రెంచి, డేనిష్, ఇటాలియన్ మొదలగు భాషలలోనికది పరివర్తితమైనది 'గొథే యను జర్మనుడా నాటకమును చదివి యానందమును పట్టలేక

గంతులు వైచెను జర్మనీలో నించుమించుగ ప్రతి విశ్వవిద్యాలయములోను సంస్కృతశాఖ కలదు ప్రసిద్ధములైన, అప్రసిద్ధములైన పాశ్చాత్యదేశములలోను, మహమ్మదీయుల ఆధిపత్యముగల దేశములలోను సంస్కృతము బోధింపబడుచునే యున్నది కెయిరోలో గాంధిశతజయంతి సందర్భమున సంస్కృతపీఠము నేర్పరచిరి నేపాలుప్రభుత్వము పశ్చిమనేపాలులో 'డాంగ్' అనుచోట సంస్కృత విశ్వవిద్యాలయము నేర్పరచుటకు 2I మంది సభ్యులతో ఒక కమిటీని వేసియున్నది ప్రపంచమంతయు దీనిని 'విశ్వభాష'గా భావించుచున్నారు,

జర్మనీలో దీనిపట్ల నెక్కువ ఆసక్తి కలదు 1802లో 'ఫ్రెడెచ్ వాన్ ష్లెజెల్' ఆంగ్లేయుడైన 'అలెగ్జాండర్ హామిల్టన్' యొద్ద సంస్కృతము నభ్యసించెను అతని ప్రోత్సాహమున నాతని సోదరుడు "విల్ హెల్మ్ ష్లెజెర్ (1767-1845) సంస్కృతము నభ్యసించి 'బాన్' విశ్వవిద్యాలయములో మొదటి ప్రొఫెసరయ్యెను అంతః భగవద్గీతకు మొదటి 'క్రిటికల్ ఎడిషన్' ప్రచురించెను గొథే స్నేహితుడగు "విల్ హెల్మ్ వాన్ హాంబోల్ట్" రీచ్ స్టాగ్ నందు సంస్కృతము ప్రత్యేక పఠనీయమగు విషయముగ చేయుటకు కృషిచేసెను 'ఫ్రాంజ్ బాప్' అను ఉద్దండ పండితుడు రామాయణ మహాభారతములనుండి కొన్ని భాగముల నెన్నికచేసి ప్రచురించెను "Conjugation system of Sanskrit language in Comparison with that of the Greek, Latin, Persian, German languages"లో చేసిన కృషి యాతనికి మంచి ప్రశస్తి తెచ్చినది "ఫ్రెడిచ్ రుక్కర్ట్" కవి (1788-I866) నలదమయంతి, సావిత్రి, రఘువంశ, భారవులను అనువదించెను మోక్షముల్లర్ (Max Muller 1823-1900) పండితుడు లీప్ జిగ్ లో 'బ్రాకహామ్' ఉపన్యాసములనువిని యాతనికి శిష్యుడై దీక్షతో సంస్కృతము నభ్యసించి 'వెస్టుబెర్లిన్'లో 'బాప్' గారి యొద్ద నధ్యయనముచేసి యదియు చాలక 'పారిస్'లో 'యూర్గిన్ బర్నౌట్' యొద్ద చదివి, గొప్ప పండితుడై విజయనగర ప్రభువులు శ్రీ ఆనందగజపతి ధనసహాయమున ఋగ్వేదమును ప్రకటించెను "పాల్ డ్యుస్సేన్" అను పండితుడు ఉపనిషత్తుల ననువదించెను ఈ విధముగ జర్మనులు సంస్కృత భాషలో మిక్కిలి పరిశ్రమచేసిరి విశ్వసంస్కృత పరిషత్తునకు పరిశీలకుడుగా తిరుపతికి I956లో వచ్చిన

ఇ ఎన్ షాఫర్ అను జర్మనుడు (Head of the South Asia service of the voice of Germany, Cologne) తమ దేశములో ప్రతి మాసమున ఒకటవ, మూడవ గురువారములయందు రేడియోద్వారమున సంస్కృత కార్యక్రమములు (wave lengths 11, 785, 15, 275 and 17,845,K C/S at 2-10 p m I S T ) ప్రసారమగుచున్నవనిచెప్పెను తిరుపతి సభలో పండితులు ధారాళముగ సంస్కృతభాషలో మాట్లాడుచుండగా సభ్యులు అభినందనపూర్వకముగా కరతాళధ్వనులు చేయురీతిని గమనించితిననియు భారతదేశమున సంస్కృతమునకు పునరుత్తేజము కలుగు అవకాశములు కలవని తాను భావించు చుంటిననియు చెప్పెను

పాశ్చాత్య పండితులు సంస్కృతముపై మిక్కిలి యభిమానమువహించిరి శ్రీ "డబ్ల్యు డి ఎట్నీ", అథర్వవేద సంహితకు ప్రాతిశాఖ్యను ఆంగ్లములోని కనువదించెను లౌకిక వైదిక వ్యాకరణములను రచించెను ధాతు క్రియారూపములను గూర్చిన గ్రంధమును రచించెను శ్రీ 'హెచ్ హెచ్ విల్సన్' మేఘదూతము, ఋతుసంహారము, విక్రమోర్వశీయముల నాంగ్లీకరించుటయే కాక, విష్ణుపురాణమును సైత మాంగ్లభాషలో లోకమున కందించి యొక వ్యాకరణ గ్రంధమునుకూడ రచించెను శ్రీ "మోనియర్ విలియమ్స్" శాంతలమును పరివర్తనము చేయుటయేకాక యొక వ్యాకరణ గ్రంధమును నిఘంటువును లోకమున కందిచ్చెను శ్రీయుతులు "రిచర్ట్ బర్టన్, యఫ్ యఫ్ ఆర్బుతునాట్" వాత్స్యాయన కామసూత్రముల నాంగ్లీకరించిరి వైదికభాషావ్యాకరణమును శ్రీ 'ఎ ఎ మాక్డొనెల్''రచించెను వైదికమైన పదకోశమును శ్రీ'బ్లూమ్‌ఫీల్డు'తయారుచేసెను వైదికములైననామములసూచికను శ్రీయుతులు ఎ ఎ మాక్డొనెల్, ఎ బి కీత్ గారలు తయారుచేసిరి సంస్కృత భాషావిషయకమైన యొక యుద్గ్రంధమును శ్రీ "టి బర్రో" రచించెను శ్రీయుతులు యి బి కావెల్, ఎ యి గౌఫ్ గారలు మాధవాచార్యులవారి సర్వదర్శన సంగ్రహము నాంగ్లీకరించిరి సామవేదమును శ్రీయుతులు రాల్ఫ్, గ్రిఫ్ఫిత్ లనువదించిరి. శ్రీ గ్రిఫ్ఫిత్ కుమారసంభవమునుకూడ ఆంగ్లీకరించెను శ్రీ''జేమ్స్ ఆర్ బల్లంటైన్"వరదరాజకృతలఘుసిద్ధాంతకౌముది నాంగ్లమున వెలుగులోనికి దెచ్చెను ఆదిశంకరుల వేదాంత సూత్రభాష్యమును శ్రీజార్జి థీబాట్

